## KANDĀLA MAKARANDĀLU



**డా॥ ఎన్. ఆర్. వెంకటేశం**

| | | |
|---|---|---|
| జననం | : | 6-6-1952 హైదరాబాదు. |
| తల్లిదండ్రులు | : | నిదానకవి ఈశ్వరమ్మ, రంగయ్య. |
| చదువు | : | ఎం.ఏ (లాంగ్వేజెస్) ప్రథమశ్రేణి - 1980.<br>ఎం.ఫిల్. నార్లవారిమాట - ఒక పరిశీలన 1983.<br>పిహెచ్.డి. జంగం కులాల భాషా సాహిత్య సాంస్కృతి-కాంశాల పరిశీలన 1992. |
| ఉద్యోగం | : | తెలుగు పండితుడు 1978 - 84.<br>జూనియర్ లెక్చరర్ 1985 - 89.<br>జూలై 1989 నుండి ఉస్మానియా యూనివర్సిటీలో ఉపన్యాసకుడు. |
| ఇతర రచనలు | : | వ్యాస ప్రసూనాలు (వ్యాససంపుటి) - 1993 |

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyderabad-20.

# కందాల మకరందాలు

## డాక్టర్ ఎన్.ఆర్.వెంకటేశం



# కందాల మకరందాలు

డా॥ ఎన్.ఆర్. వెంకటేశం

దివ్యదీప్తి ప్రచురణలు
హైదరాబాదు
1993

KANDALA MAKARANDALU
(Poems)
by Dr. N.R. Venkatesham

April 1993

Copies : 1000

Cover Design by :
SHEELA VEERRAJU

Price : Rs. 15/-

For Copies :
N. Vikranth
H.No. 18-2-192/2,
Jangammet, Falaknuma,
Hyderabad-500 253.
Phone : 523202

Printers :
Padmavathi Art Printers
1-1-517/B/1, New Bakaram,
Gandhinagar, Hyderabad-380.
Phones : 611413, 600547

# అంకితం

సిరివాటి దేవకమ్మకు
అరయంగా అమ్మలాంటి అక్కకు ఎంతో
మురిపెంగా అర్పింతును
చిరుపొత్తము ఈ శతకము చిరముగ సుమనా!

**ఆచార్య చేకూరి రామారావు**
డీన్, ఫేకల్టీ ఆఫ్ ఆర్ట్స్,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

# కందాల్లో అందాలు

పద్య కవిత్వ భవిష్యత్తును గురించి, ఆ మాటకొస్తే వర్తమానం గురించి కూడా రకరకాల అనుమానాలు, కుశంకలు వెలువడుతున్న సమయంలో డా॥ వెంకటేశం రచించిన 'కందాల మకరందాలు' చదువుకోవటం ఓ చిత్రమైన అనుభూతి! ఒకవేళ పద్య కవిత్వం అంతరించిపోయినా, శతకం మాత్రం చిరకాలం బతుకుతుందనే నా నమ్మకం. పద్యాన్ని ప్రధాన వాహకంగా వాడుకోవటం మానేసిన వాళ్ళు కూడ శతకరూపంలో పద్యాన్ని వాడుకుంటూనే ఉన్నట్టున్నారు. ఒకనాటి శ్రీశ్రీ, నిన్నమొన్నటి దేవిప్రియ, ఇటీవల కేరా లక్ష్మి శతకంతో ప్రత్యక్షమైన ఆరుద్ర - నా ఈ నమ్మకానికి ఆధారాలు.

వస్తు కవిత్వం బలంగా ఉన్నప్పుడు ఆత్మ నివేదనకు శతకమే ప్రధాన మార్గంగా ఉండేది. కవి తన ఆర్తిని చెప్పుకోవాలన్నా లేక ప్రపంచగతిని తాను చూస్తున్న విధం చెప్పాలన్నా, ఏదైనా సందేశం ఇవ్వాలన్నా లేక చిలిపిగా కొన్ని విషయాలు సరదాగా చెప్పాలన్నా లేక వైవన్నీ కలిపి చెప్పాలన్నా శతకం చక్కగా వొదిగిపోయే కావ్యరూపం. అందువల్ల ఒకవేళ నిజంగా పద్య కవిత్వం ఆరోగ్యం చెడిపోతేగనక, దాన్ని బతికించేది శతకమే అని నా నమ్మకం.

ఆధునిక కవిత్వం కథాశ్రయాన్ని వదిలేసి, భావాశ్రయం వైపు చేసే ప్రయాణంలో ఆత్మాశ్రయత్వం ఒక ముఖ్యమైన మజిలీ.

కల్లూరి భాస్కర్ (ఆంధ్రప్రభ 12-3-93) ఎంత కాదన్నా లేక వేరన్నా, శతకాల్లోని ఆత్మాశ్రయత్వం ఆధునిక కవిత్వంలోని ఆత్మాశ్రయత్వానికి సన్నిహితమైందేనని నా ఉద్దేశం. ప్రబంధపురాణ కవిత్వాలు పరాఙ్ముఖమైనా, శతక కవిత్వం మాత్రం పరిఢవిల్లుతూనే ఉంది. ఇందుకు కారణం శతకకవిత్వంలో ఉన్న ఆత్మాశ్రయ లక్షణమే అనుకుంటాను. ఆత్మాశ్రయమనేది అంతపెద్ద గొట్టు సాంకేతిక పదమేమీ కాదు. కవి తాను చెప్పదలుచుకుంది-అది నీతి అయినా, సందేశమయినా లేక ఆర్తి అయినా, ఆవేదనయినా-సరాసరి పాఠకుడికి లేక శ్రోతకు చెప్పే పద్ధతే ఆత్మాశ్రయత్వం. అది శతకాల్లోనూ ఉంది, ఆధునిక ఖండకావ్యాల్లోనూ ఉంది.

తెలుగు శతకాలకు మకుటం ఒక సంప్రదాయమయింది. ఈ మకుటం సంబోధన రూపంలో ఉంటుంది. సంస్కృతంలో మకుటం లేకపోయినా శతకమంతా ఒకే వృత్తంలో ఉంటుంది. తెలుగులో మకుట నియమం వృత్త నియమాన్ని విధిస్తుంది. అదికాకపోయినా శతకాలు ఒకే రకపు పద్యాల్లో ఉండటం అనూచానంగా వస్తున్న సంప్రదాయం. వీటిలో కంద పద్య శతకాలది అదొక బాణీ.

ఆధునికుల్లో ప్రముఖులు ముఖ్యంగా ఆధునిక విషయాలను ప్రస్తావించదలుచుకున్నవారు. ఎక్కువగా కందపద్య శతకాలనే రాసినట్టు కనిపిస్తున్నది. శ్రీశ్రీ, బోయి భీమన్న, న చ. రామానుజాచార్యులు, దేవిప్రియ, ఆరుద్ర - ఇట్లా చాలామంది కందపద్యాన్ని ఎన్నుకున్నట్టు కనిపిస్తుంది. రెంటికీ పెద్ద సంబంధం లేకపోయినా ఆధునికులు హాస్యంగానూ, సరదాగానూ రాయదలుచుకున్న శతకాలు కందాల్లోనే ఉన్నాయి బహుశః వీళ్ళందరికీ ఆదిగురువు కవి చౌడప్ప కావచ్చు. అయితే సీరియస్ శతకాలు కూడా కందాల్లో లేకపోలేదు. అందులో ముఖ్యమయింది సుమతీ శతకం. ఈ వెంకటేశంకు కొంత



ప్రేరణ సుమతీ శతకం, మరికొంత ఆధునిక కంద శతకాలు. శతక మంటే నూరు పద్యాల సంపుటి అని అర్థమున్నా, శతకాలన్నీ నూరు పద్యాలకే పరిమితం కాదు. నూరుకు తక్కువ కాకుండ అని అర్థం చెప్పుకోవచ్చు.

ఆధునికులు కందపద్యాన్ని ఎన్నుకోవటానికి అధిక నియమా లున్న పద్యంలో తమ ప్రతిభ చూపించాలన్నది ఒక కారణమైనా అంతకుమించి కంద పద్యం మాత్రాబద్ధం కావటం వల్ల లయల హొయలు ప్రదర్శించటానికి వీలవుతుందన్న బలమైన నమ్మకమే అసలు కారణమనుకుంటాను. మాత్రాబద్ధమైన పద్యంలో సంప్రదాయ బలం వల్ల ప్రాచీన కావ్యరూపాలు తప్పకపోయినా, ఉద్దేశమే ఉంటే-ఆధునిక వ్యవహార రూపాలను అధికంగా ప్రయోగించి పాఠకుల భాషకు అతి సన్నిహితంగా తీసుకొచ్చే వీలుంది.

కందం చాలా చిన్న పద్యం కావటంవల్ల యతిప్రాసలు దగ్గర దగ్గరగా వచ్చి, అనుప్రాసగా మారి అందులోనూ ప్రాసేతర స్థలాల్లో కూడ ఒకటి రెండు చోట్ల ప్రాసలాంటిదాన్ని పాటిస్తే పద్యానికి ధ్వని మాధుర్యాన్ని కలిగించవచ్చు. అదే బిందు పూర్వక ప్రాసైతే ఈ సౌందర్యం ఇనుమడిస్తుంది. ఈ రహస్యం వెంకటేశంకు తెలుసు. ఉదాహరణకు ఈ రెండు పద్యాలు చూడండి:

కందాలను రసవన్మా
కందాలుగ తీర్చి మునుపు కవనం చెప్పా
రెందరొ వారందరి కభి
వందన శతమందజేతు వరుసగ సుమనా!

శృంగారం అంగారం
పొంగించిన కవితలల్లి పొందెను పీఠం
హంగుగ విశ్వంభర గిరి
శృంగం చేరెను సినారె జేజేల్ సుమనా!

ఉదాహరించిన పద్యాల్లో మొదటి దాంట్లో మూడవ పాదంలో 'అందరి' అనే శబ్దం, నాల్గవ పాదంలో 'అందజేతు' అనే శబ్దం ప్రాసతో కలిసి పద్యానికి అనుప్రాస సౌందర్యాన్ని కూర్చాయి. అట్లాగే ఉదాహరించిన రెండవ పద్యంలో కూడ 'అంగారం' శబ్దంలో ఈ అనుప్రాస రీతి కనిపిస్తుంది. పద్య రచనా సౌందర్యం మీద దృష్టి ఉన్నవాళ్ళే ఈ రకమైన ప్రయోగాలు చేయగలుగుతారు. ఈ ఉదాహరించిన చోట్లే కాకుండ వెంకటేశం చాలా చోట్ల ఇట్లాంటి ప్రయోగాలు చేస్తాడు. ఉదాహరణకు ద్విత్వ సకారప్రాసంలో పాములా బుసలు కొడుతున్న ఈ పద్యం చూడండి.

బస్సులు టైముకు రాకను
మిస్సయి ఆఫీసు పోక మిగిలితె అచటే
కస్సను బుస్సను రేపిక
బస్సుల కిస్సా తెలియని 'బాసుడు' సుమనా!

కందం నాలుగు మాత్రల గణాలతో నడిచే పద్యం. లెక్క ప్రకారం ఇది చతురశ్ర గతిలో నడవాలి. అయితే అంతా చతురశ్ర గతిలోనే ఉంటే పద్యంలో వైవిధ్యం లేక విసుగెత్తించవచ్చు. లయ పరిజ్ఞానం ఉన్న కవి అవకాశం దొరికితే లయ వైవిధ్యం చూపించకుండా ఉండలేడు. నాలుగు మాత్రల గణాలు మూడు రావలసిన చోట లెక్క కుదురుతూనే రెండు సమభాగాలుగా అంటే ఆరు మాత్రల గణాలుగా విరిగేట్టు నడిపితే ఆధునిక కవి ప్రయోగంలో వున్న త్రిశ్ర గతి లయకు సన్నిహితమవుతుంది. ఉదాహరణకు —

శిలలా అవి పరికించగ (పుట 2)
పనిసాయము మనిసాయము (పుట 3)
హరిజనుడో గిరిజనుడో (పుట 4)
చెలికోపం తీర్చగలం (పుట 10) - ఇట్లాంటివి చాలాచోట్ల



కనిపిస్తాయి. ఇది సాధారణంగా చాలామంది చేస్తారు. వెంకటేశం ఇంకొంచెం ముందుకు పోయి ఇంకా ఇతర రకాల మిశ్ర లయలను సాధించాడు. ఉదాహరణకు ఇది చూడండి:

నల్లని మేఘాలు ముసిరి
చల్లని పవనాలు విసిరి చలిబాధిస్తే
ఉల్లములో పుట్టి వణుకు
మెల్లగ తనువెల్ల పాకి మించును సుమనా!

ఈ పద్యంలో ఒకటి, రెండు, నాల్గు పాదాలను చతురశ్ర గతిలో చదువలేము. త్రిశ్ర గతిలో కష్టంగా చదువగలం. కాని నాలుగు-ఐదు-మూడు అనే మాత్రల విరుపుతో మిశ్రగతిగా చదివితేనే ఈ పద్యం సొగసుగా ఉంటుంది. ఆ చదవటంలో ఏదో మాత్రమీద ఎక్కువ ఊనిక పెట్టి చదివితే ఇంకా ఎక్కువ సొగసుగా ఉంటుంది. అసలు అట్లాగే చదువుతాం.

కంద పద్యంలో ఏ పాదానికి ఆ పాదం విరిగితే ఒక అందం. ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకుపోతే మరో అందం. మొదటిది చాలామంది చేస్తారు. రెండోది పద్య సౌందర్యం తెలిసినవాళ్ళు చేస్తారు. వెంకటేశం ఈ రెండూ చేసినట్టు ఈ పుస్తకంలో సాక్ష్యాలున్నాయి. ఇంతకుముందు ఉదాహరించిన "కందాలను రసవన్మా కందాలుగ తీర్చి...." అనే పద్యంలో ఏ విధంగా ఒక పాదం మరో పాదంలోకి చొచ్చుకు యిందో గమనించవచ్చు. ఎక్కడా ఆపకుండా, పూర్తయ్యేవరకూ గుక్క తిప్పుకోకుండా చదివించే పద్యం ఇది. ఇట్లా చొచ్చుకుపోయే పద్యంలో జాతీయాలు ఇమిడ్చగలిగితే ఇంకా అందంగా ఉంటుంది.

"లత సుడిగాలికి అతలా
కుతలం అయిపోయినట్లు...." (పుట. 10) - అన్నచోట ఒక

పాదం ఇంకో పాదంలోకి చొచ్చుకుపోవటమేకాదు, ఇక్కడ నిలిచిన జాతీయం ప్రాసనియమాన్ని కూడ కడుపులో దాచేసుకుంది.

ఇంగ్లీషు పదాలను తెలుగుమాటలంత సాఫీగా, అనాయాసంగా కంద పద్యంలో ఈ కవి ఇమిడించిన తీరు చాలా ఆకర్షణీయంగా ఉంది. రికమండేషన్, ఏర్‌కండీషన్ వంటి మాటలు ఎంత అలవోకగా ఇమిడిపోయాయో. అట్లాగే—

జూ, పార్కుల్, మ్యూజియములు
ఆపై నౌబత్‌పహాడు అలటాంక్బండున్ (పుట. 11) - అన్న

అర్థ కందంలో ఇంగ్లీషుమాటలు ఎట్లా ఇమిడాయో చూడండి.

అన్నిటికి ఉదాహరణ లెందుకు గాని వెంకటేశం కందాలు చదివేటప్పుడు ప్రాస ప్రయోగాలమీద ఓ కన్నేసి చదవటం మంచిది.

ద్విరుక్త వ్యంజనాలతోనూ, సంయుక్త వ్యంజనాలతోనూ ప్రాసలు వేయటం ఈయనకు చాలా సరదా. తమాషా ఏమిటంటే ఇట్లాంటి ప్రాసలు కూడ అవి ప్రాసకోసం వేసిన పదా లనిపించవు. ఈ రకమైన ప్రాసలు చాలాచోట్ల కవులకు పరీక్షలు పెడతాయి. ఎంతో పద సంపద అధీనంలో వుంటే తప్ప ఈ పరీక్షలో నెగ్గటం కష్టం. దానితోపాటు తగిన అభ్యాసమూ ఉండాలి. ఈ రెండూ వెంకటేశంకు ఉన్నట్లు ఈ కందాలు చదివితే మనం గమనించవచ్చు. ముఖ్యంగా "నర్తింతురు కనుసన్నల .... (పుట. 13)", "ఉత్సాహపు బిల్ క్లింటన్ .... (పుట. 14)" అన్న పద్యాలు చదివిచూడండి.

ఈ శతకం చదివేవారికి పజిల్ లాంటిది ఈయన వాడిన విసంధులు. నిత్యసంధులను కూడ ఈయన వికల్పం చేసి విసంధులు చేశాడు. ఈయనకి ఈ సంధి తెలియదందామా? తెలుగులో ఎం.ఏ., పిహెచ్.డి. చేసినవారికి ఈ సంధి తెలియదనటం అన్యాయం. ఇట్లా సంధి చేయక పోవటానికి బలమైన కారణమే ఉండాలి. నిజానికి కొద్ది మార్పులతో సంధులు పొసగించటం పెద్ద కష్టమూ కాదు. ఉదాహరణకి "అనుభవ సారమని బుధులు అందురు సుమనా!" దీన్ని "అనుభవ సారంబని బుధులందురు సుమనా!" అని ఏ గణభంగం, యతిభంగం లేకుండా శుభ్రంగా సంధి చేయవచ్చు. అయితే సంధి చేయటం కోసం 'సారంబు' అనే అతిప్రాచీన (Archaic) రూపాన్ని వాడాల్సి వస్తుంది.



ఈ కందాలన్నిట్లోనూ భాషను సాధ్యమైనంతగా వ్యవహార భాషకు సన్నిహితంగా తేవాలన్న ప్రయత్నం కనిపిస్తున్నది. ఆ ప్రయత్నంలో భాగమే బహుశః ఈ విసంధి ప్రయోగం. నిజానికి తెలుగు వచనంలో విసంధులు ప్రచురంగానే రాస్తున్నారు. వెంకటేశం చేసిందల్లా వచనంలో వాడుకలో ఉన్నదాన్ని పద్యంలోకి కూడ ప్రవేశ పెట్టటం. అంటే మంచి లక్ష్యంతో చేసిన వ్యాకరణ నియమభంగం.

ఈ పుస్తకంలో కవి ఆర్తి, ఐడియాలజీ, వివిధ విషయాలమీద ఆయన ఉద్దేశాలు కనిపిస్తాయి.

ఉదాహరణకి-

"చీకాకు పరిచి దళితుల
మూకుమ్మడి బానిసలుగ ముంచిరి నాడున్
చేకొన్న రిజర్వేషను
పోకార్చాలంటు నేడు పోరిరి సుమనా!" - వంటిపద్యాల్లో

నిమ్నవర్గాలకు ఉన్న కొద్దిపాటి రాయితీలకు వ్యతిరేకంగా జరిగే ఆందోళనపట్ల కవి ఆర్తి వ్యక్తమవుతున్నది.

అట్లాగే పాపాయిల మీద ముచ్చటైన మూడు పద్యాలు 8 వ పేజీలో ఉన్నాయి. అందులో ఒకటి ముద్దుపేరుతో పిల్లల చెక్కిళ్ళను గిల్లే శాడిజాన్ని నిరసించే పద్యం. పిల్లలను ప్రేమించే మంచి మనస్సున్న వాళ్ళకే ఈ రకపు ఊహలు సాధ్యం.

వెంటేశం పదాలను ప్రయోగించేటప్పుడు వాటి సాకార్థ్యన్ని దృష్టిలో ఉంచుకొని, వీటిని ప్రయోగించటం ఈ శతకంలో కనిపిస్తుంది. ఉదాహరణకి-

"ఎటు చూడు మురికివాడలె
ఎటు నడిచిన దారులిరుకె ఏమని చెప్పన్
కటకట! యీ ఓల్డు సిటీ
నిటలాక్షుకె భీతిగొల్పు నిజముగ సుమనా!"

ఈ పద్యంలో 'నిటలాక్షుడు' అనే మాట చాలా అర్థవంతంగా వాడాడు. మూడు కన్నులున్న వాడికి కూడ ఓల్డుసిటీ దారులు భయంకరంగా ఉంటాయి. ఇక రెండు కన్నులున్న మనకెంత? అనే అర్థం ఇందులో ఉంది. అంతేకాకుండా మూడు కన్నులున్నవాడి మూడో కన్ను మంట (వెలుగు) కన్ను. దారి చూపించగల కన్ను. అయినా అతనికే సాధ్యం కాదు, మనకెంత? అని.

అట్లాగే క్లుప్తీకరణ ద్వారా ఏకరూపం చెందిన రెండు మాటలను చమత్కారంగా వాడిన ఈ పద్యం చూడండి.

ప్రకేజీ చదువుల కోసము
కేజీకగు పుస్తకాలె కేజీలయ్యేన్
కేజీకయ్యే ఖర్చులు
పీజీ కంటెను అధికము వినరా సుమనా!

ఇందులో మొదటి కేజీ (K. G) కిండర్ గార్టన్. రెండవ కేజీ కిలోగ్రాం.

ఈ కవి మతసామరస్యాన్ని బోధించే పద్యాలు కొన్ని రాశాడు. అడుగు తరగతి వారికి జరిగే అన్యాయాలకు స్పందించాడు. చోటా మోటా నాయకులు వేసే వేషాలను విసుక్కున్నాడు. అసమసంఘ వ్యవస్థను అసహ్యించుకున్నాడు. ఇట్లా ఎన్నో రకాలుగా ప్రగతి భావాలను పద్యాల్లో ప్రకటించాడు. వాటికేంగాని, అత్యాధునికమైన



స్త్రీవాద భావాలను కూడ ప్రతిఫలించాడు. జెండర్ సమస్యను చిత్రిస్తూ రాసిన ఈ పద్యం అందుకు ఉదాహరణ —

సుతనేమో తక్కువగను
సుతునేమో ఎక్కువగను చూసెడివారల్
అతివల నవమానించే
మతిహీనులు మూర్ఖ జనులు మహిలో సుమనా!

ఈ పుస్తకంలో చాలామంచి అభిప్రాయాలున్నాయి. ఎన్నో నేర్చుకోదగిన అంశాలున్నాయి. మనకు కర్తవ్యబోధచేసే పద్యాలు చాలా ఉన్నాయి. ఎందుకో ఈ కవి హాస్యాని కెక్కువ ప్రాధాన్యమివ్వలేదు. ఇంతకుముందు తెలుగులో వచ్చిన ఆధునిక కంద శతకాల్లో హాస్యం పాలెక్కువ. అయితే ఒక్క అపురూపమైన హాస్య పద్యం మాత్రం దొరికింది. అది ఇది:

పోలీసులు మిత్రులనే
వ్రేలాడే బోర్డు చూసి వింతగ జనముల్
ఈలాంటి జోకులేలని
వ్రేలేసుక ముక్కుమీద వెళ్ళిరి సుమనా!

ఈ పద్యం చదివితే 'ఆదాయపు పన్ను శాఖ మిమ్మల్ని ఆహ్వానిస్తున్నది' అన్న బోర్డు నాకు గుర్తొచ్చింది. వారి ఆహ్వానం లాంటిదే వీరి మైత్రి కూడా!

కందపద్య లయ రహస్యాలను, గమన సౌందర్యాలను బాగా ఎరిగిన వెంకటేశం రచించిన కందాల మకరందాలను ఆహ్వానిస్తున్నాను. ఇది ఈయన మొదటి శతకమేనని రెండో శతకంలో కాస్తా హాస్యాన్ని కూడా అందిస్తాడని ఆశిస్తాను.

హైదరాబాదు
22.4.1993

చేకూరి రామారావు

ఆచార్య ఎస్వీ రామారావు
తెలుగు విభాగం,
ఉస్మానియా విశ్వవిద్యాలయం

## 'ఆధునిక' పద్యం

శ్రేయస్కర భావాలను కవితాత్మకంగా మలచటానికి చేసిన ప్రయత్నం 'కందాల మకరందాలు.' వివిధ సందర్భాలలో వెంకటేశం పొందిన సామాజిక స్పందనకు తార్కాణాలు ఈ మాకందాలు. పాత నగరంలోని కర్ఫ్యూల బాధలు, కులాలపేరిట జరిగే ఘోరాలు, ఎంగిలి మెతుకులతో వెళ్ళదీసుకునే జీవితాలు, సూపర్ స్పెషాలిటీల లోని వ్యాపారాలు మొదలైనవి వీనిలో ప్రసక్తమయ్యాయి.

"శిల్పాలు మలలకు పూచిన విరులు"

"పాల మనసుగల బాలలు దీపాల వెలుంగులు"

"చలన చిత్రము జనజీవన ముకురము" — అన్న హ్లాద రమణీయోక్తులతోపాటు వ్యంగ్య హాస్యోక్తులు కూడ ఈ కృతిలో చోటు చేసుకున్నాయి.

"క్రేజీ చదువుల కోసము
కేజీకగు పుస్తకాలె కేజీలయ్యేన్"
"పోలీసులు మిత్రులనే
వ్రేలాడే బోర్డుచూసి వింతగ జనముల్
ఈలాంటి జోకులేలని
వ్రేలేసుక ముక్కుమీద వెళ్ళిరి సుమనా!"

సహస్రాబ్దాలుగా, శత పరంపరగా కొనసాగుతున్న శతక ప్రక్రియ నేటికీ నవం నవంగానే వెలుగొందుతున్నది. పద్య ఛందస్సులో కూడ ఆధునికతకు అవకాశం వుందా? అని ప్రశ్నించే సందేహ మనస్కులకు ఈ కృతులే సమాధానాలు. అందుకు రచయితను అభినందిస్తున్నాను.

సికిందరాబాదు
తేది : 26-4-1993.

డా॥ ఎస్వీ రామారావు

ఆచార్య ఎన్. గోపి
చేర్మన్, బోర్డ్ ఆఫ్ స్టడీస్
తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం

## పద్యం – నేపథ్యం

పాడిందల్లా పాట కానట్టే, అల్లిందల్లా పద్యం కాదు, అంటే కవిత్వం కాదు అని తాత్పర్యం. గణాలు, యతిప్రాసలు కుదిరినంత మాత్రాన అది కవిత్వమౌతుందనే గ్యారంటీ లేదు. అలాగైతే లీలావతి గణితం కూడా గొప్ప కవిత్వమై వుండేది. అంటే పద్యం రాసినా గద్యం రాసినా, వచనం రాసినా మౌలికంగా ప్రతిభ ముఖ్యం. మిగిలినవి సాధనతో సాధించాలి.

పద్యం తెలుగుజాతి సాహిత్యసంపద. అమూల్యమైంది. పద్యాల్లో గొప్ప సాహిత్యం నిక్షిప్తమై వుంది. పద్యానికి గతి తప్ప క్షతి లేదు. అయితే ఒక్కో కాలంలో అప్పటి అవసరాలకు తగినట్లుగా కొన్ని కొత్త ప్రక్రియలు వస్తాయి. ఏక కాలంలో అనేక ప్రక్రియలు సహజీవనం సాగించడం అన్ని సాహిత్యాల్లో ఉండేదే. వచన కవిత్వం పద్యానికి కొనసాగింపు కాదు. ఒకప్పుడు గతిలో నిర్మాణంలో మరింత స్వేచ్ఛ కోసం, వెసులుబాటు కోసం ప్రయత్నించి సఫలమైన ప్రక్రియ వచన కవిత. ఆ సంధి దశను కుందుర్తి ఆంజనేయులుగారు చక్కగా ప్రతిబింబించారు. తొలి రోజుల్లో ఆయన యువకవులు ప్రాచీన కవిత్వం క్షుణ్ణంగా చదువుకుంటేనే ఆధునిక కవిత్వం రాణిస్తుందని చెప్పేవారు. తర్వాత రోజుల్లో యువకులు ప్రాచీన కవిత్వం చదువక్కర్లేదని అనే దాకా వెళ్ళారు. ఇదంతా కుర్రాళ్ళను సంతోషపెట్టటానికనేది స్పష్టం. ఇవన్నీ ఉద్యమాలు నడిపేవాళ్ళ స్ట్రాటెజీలు. స్ట్రాటెజీలకు అతీ

తంగా ఆలోచిస్తే ప్రాచీన కవిత్వం చదువుకోవడం వల్ల ఆధునికులకు మరింతం బలం, ప్రయోగశీలం సమకూరుతాయని అర్థమౌతుంది.

కొందరు పద్యానికి వచన కవిత్వానికి శత్రుత్వం వున్నట్టు మాట్లాడతారు. ఆ మధ్య రాజమండ్రి సాహిత్య పీఠంలో వచనకవితా సదస్సు జరిగింది. అప్పుడు ఈ ధోరణి కొట్టొచ్చినట్టు కనపడింది. ఇటువంటివి చిన్న బుద్ధుల కృత్రిమ సృష్టి మాత్రమే. సాహిత్యేతర ప్రయోజనాలున్నప్పుడే ఇటువంటి అనారోగ్యకర ధోరణులు తలెత్తు తాయి. మొత్తంగా చూడడం నేర్చుకున్నప్పుడు ఇటువంటి సమస్య లుండవు.

ప్రస్తుతం పద్యాల పునరుజ్జీవన ప్రయత్నాలు జరుగుతున్నట్టు కనిపిస్తున్నది. నిజానికి పద్యం మరణించలేదు. మరణించదు. కేవలం పద్యమాత్రులు కాకుండా ప్రతిభా సంపన్నులైన కవులు మంచి కావ్యాలు రాస్తే, ఈ ప్రక్రియ ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూనే ఉంది. ఇటీవల వెలువడిన క్రొత్త గోదావరి దీనికి ఉదాహరణ. పద్యానికి ఆదరం లేకపోలేదు అనటానికి నిన్న మొన్న జరిగిన శతావధాన, అష్టావధానాలు యువకులను ఆకర్షించటం ఒక నిదర్శనంగా చెప్పవచ్చు. నేనీమధ్య దూరదర్శన్‌లో నిర్వహించిన 'మా తెలుగుతల్లి' సాహిత్య కార్యక్రమాల్లో డా. ప్రసాదరాయ కులపతితో చేసిన గోష్ఠి ఎంతోమందికి నచ్చినట్టు వారి వేలాది ఉత్తరాల వల్ల తెలుస్తున్నది. అవధానాల్లో నేటి కంప్యూటరైజ్డ్ ఎలిమెంటు ఉంది. ధారణ మొదలైనవి. సమయస్ఫూర్తి ఆయా వ్యక్తుల సిద్ధిపై ఆధారపడి వుంటుంది. అయితే అవధానాల్లో పాల్గొనేవాళ్ళు దానిని కాలానుగుణమైన మారిన భావాలతో మలుచుకొనవలసి వుంది. అశ్లీలత స్ఫురించే, స్త్రీలను కించపరిచే వెకిలి మాటలను పరిహరించుకోవలసి వుంది. అప్పుడు అవధానాలకు తప్పకుండ ఆలనాటి ఘనమైన రోజులు వస్తాయి.



ఇటువంటి నేపథ్యంలో ఈనాడు కందపద్యాల శతకంతో మన ముందుకు వస్తున్నారు డా॥ వెంకటేశంగారు. కందం రాయటం ఎంత కష్టమో విజ్ఞులకు తెలుసు. ఎందుకంటే ఇందులో విధులతో పాటు నిషేధాలు కూడా ఉంటాయి. పైగా పొట్టి పద్యం. వెంకటేశంగారు నేను గమనించి నంతవరకు ఈ పద్య రచనలో ఎంతో శ్రద్ధ తీసు కున్నారు. ముఖ్యంగా అనుకున్నట్టుగా కుదరని పద్యాలను ఆవలీలగా వదులుకోగలిగిన ఆయన నిర్మమత్వం నాకు నచ్చింది. ఎదుగుదలకు తప్పకుండా ఇదొక మెట్టు.

అన్నట్టు ఆయన వచన కవిత్వం కూడా రాశారు. అవి కూడ ఇదే విధంగా భావుకతతో, లోక వృత్త పరిశీలనతో నిండి వున్నాయి. వెంకటేశంగారు ఇతోధిక పరిశ్రమ చేస్తూ సాహిత్య రంగంలో తన దైన బాణీని ఏర్పరచుకోవాలని ఆకాంక్షిస్తున్నాను.

—గోపి.

**డా. ఎల్లూరి శివారెడ్డి**
రీడర్, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# కంద శంపాలతలు

వచనానికీ, వచన కవిత్వానికి తేడా తెలియరాని ఈ రోజుల్లో, పద్యరచన చేసే వాళ్ళు కనిపించకుండా పోతున్నారని సంప్రదాయ ప్రియులు వాపోతున్న ఈ రోజుల్లో, పద్యాలు అప్పుడప్పుడూ కవులు రాస్తున్నా గణాలే తప్ప గుణాలు లేవని కవితా రసికులు పెదవి విరుస్తున్న ఈ రోజుల్లో కందాల మకరందాలు పంచటానికి మన ఎదటికి వచ్చారు డా॥ ఎన్. ఆర్. వెంకటేశంగారు. పద్యరచనలలోని పట్టులు తెలిస్తేగాని కందరచన సాధ్యపడదు. అధిక్షేపం, హాస్యం, ఆక్రోశం, అవినీతి నిరసనలాంటి భావాలు సమర్థుడైన కవి చేతుల్లో కందాలుగా, కవితలోని అందాలుగా పరిణమిస్తాయి. పద్యరచనలో - అందులో ముఖ్యంగా కంద పద్యరచనలో - వాడుకపదాలు దొరలించి సరిక్రొత్త శైలి సృష్టించాలన్నది ఆధునిక కవులలో కొందరి అభిప్రాయం. అది సరిగ్గా సాగకపోతే వెగటు పుట్టిస్తుంది. డా॥ వెంకటేశంగారు వాడుక పదాల వినియోగం చేశారు కాని అది ఏ మాత్రం శైలీ సుభగత్వానికి భంగం కలిగించలేదు. సరికదా అందాన్ని పెంచింది. అది తెలిసి ప్రదర్శించిన విద్య. ఉదాహరణకు ఈ పద్యాన్ని గమనించండి.

"సిద్ధాన్నము కబళించే
గద్దలుగా కొంతమంది గడుపుతు బ్రతుకున్
సిద్ధాంతపు ముసుగుల్లో
రాద్ధాంతము చేయుటంత రట్టడి సుమనా!"



ఈ పద్యంలోని వ్యావహారిక భాషా విన్యాసం పటిష్ఠంగా ఉంది. సూటిదనం చక్కదనాన్ని పెంచింది. అభిప్రాయ తీవ్రతను శైలి స్పష్టీకరించింది.

డా॥ వెంకటేశంగారి హృదయంలో దాగిన గంభీర విషయాలు ఈ శతక కందాలుగా రూపొందాయి. రాళ్ళు శిల్పాలుగా మారిపోతే వాటిని చూసి ఈ కవి "శిలలా అవి పరికించగ మలలకు పూచిన విరులు" అంటారు. చలివేళను వర్ణిస్తూ "చలిదెబ్బకు తరులు పగులు మలలే కనిపించకుండ మంచున దాగున్" అని కవిత్వీకరిస్తారు. అప్పుడప్పుడూ మనసులో నిలిచిపోయే భావాలను సూక్తి ప్రాయంగా కందాలుగ మలుచుకుంటారు.

"అద్దము రూపును చూపును
ముద్దుగ హృదయాన్ని వాని మోమే చూపున్
బుద్ధిని మాటే చూపును
ఒద్దిక వర్తనను చూపు నొనరగ సుమనా!"

ఇది ఆయన ఆత్మీయతకు, స్వచ్ఛచిత్తానికి ప్రతీక. పుస్తకం చేతపట్టుకుంటే వదలలేం. ఆలాగే ఈయన పద్యాలు మనసులోకి పోతే చెరిగిపోవు. అనుదిన సాధనతో, స్వచ్ఛంద చిత్తంతో, స్ఫూర్తితో, కవితార్తితో రాణించిన డా॥ వెంకటేశం గారి కందాలు అందరినీ అలరిస్తాయి. ఆయన శతక రచననుంచి శతాధిక రచనలు చేయాలని నా ఆశంసన. అందుకాయన అర్హులని నా అభినుతి.

హైదరాబాద్
27-4-1993

డా. ఎల్లూరి శివారెడ్డి

**డా॥ కె. వి. సుందరాచార్యులు**
యం.ఏ; పిహెచ్ డి.
ఇ నెం. 23.6.121/2, హరి బౌలి,
హైదరాబాద్–500 002.

# ఆశీస్సులు

చి॥ వెంకటేశం ఇంటిపేరు 'నిదానకవి', అతనిలోని కవి నిదానంగా 20 ఏళ్ళ తర్వాత బయట పడుతున్నాడు. పుట్టుకతో వచ్చిన ప్రతిభకు విద్యాభ్యాసం చేసినన్నాళ్ళు వ్యుత్పత్తిని ప్రోది చేసుకొన్నాడు. మరో పదేళ్ళు అభ్యాసం చేశాడు. అందుకే రసవన్మాకందాల వంటి కందాలు అందిస్తున్నాడు. తనువు నిచ్చిన తలిదండ్రులను, విద్యాబుద్ధులు గరపిన గురువులను తొలి పద్యంలోనే తలచుకొన్నాడు, త్రికరణశుద్ధి ప్రతి పద్యంలో తొంగి చూస్తుంది మాటలో, చేతలో, మనుగడలో వినయ - విధేయతలున్నవాడు. అవే రెండవ గ్రేడు తెలుగు పండితుని నుండి విశ్వవిద్యాలయ అధ్యాపకుని దాకా తీసుకొని పోయినాయి.

తాను చూచిన సామాజిక రుగ్మతలన్నీ అతన్ని చలింపచేసినాయి. ప్రతిస్పందనకు పద్యం ఇందులో సాక్షాత్కరించింది. ఒరవడిగా ఒకరిద్దరున్నా వాడుక భాషలో పద్యాలు చెప్పటం అస్మదాదుల కానందాన్ని కలిగిస్తుంది. విజయోస్తు–

"శ్రీముఖ" ఉగాది
1993

డా॥ కె. వి. సుందరాచార్యులు

# నివేదన

నేను హైస్కూల్లో చదువుతున్న రోజుల్లో హెడ్మాస్టర్‌గావున్న పి.వి. రామకృష్ణారావుగారు విద్యార్థులను ప్రోత్సహించటానికి స్కూల్లో లిఖిత మాసపత్రికను ప్రారంభించారు. ఆ పత్రిక కోసం నేను కూడ కొన్ని కవితలు రాసిచ్చాను. నేను రాసినదాంట్లో కొన్ని ఛందోబద్ధమైన పాదాలు దొర్లాయట ఎడిటింగ్ చేస్తున్న చరిత్రాధ్యాపకులు వెంకటాచారిగారు నన్ను పిలిచి, 'నీకు ఛందస్సు తెలుసా' అని అడిగితే, 'తెలియదు సార్' అన్నాను. అప్పుడు వెంకటాచారిగారు నాకు ఛందస్సు గురించి చెప్పి "ఛందస్సు తెలుసుకొని పద్యాలు రాయటానికి ప్రయత్నించి చూడు" అని సలహా ఇచ్చారు. నేను ఛందస్సు చదివి, ఉత్సాహంగా రకరకాల పద్యాలు రాసి, ఆ లిఖిత మాసపత్రికలో నాపేర, నా మిత్రులపేర వేస్తూవుండేవాణ్ణి. అప్పుడు రాసిన పద్యాలన్నీ గణాలు పూరించినవేగాని, రసభావాదులు కొరవడినవని వేరుగా చెప్పనవసరం లేదు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాలలో చదువుతున్నప్పుడు గురుముఖతః ఛందస్సు అధ్యయనం చేయటం జరిగింది. ఆ సమయంలో అప్పుడప్పుడు నేను రాసిన పద్యాలు కొన్ని వివిధ పత్రికల్లో అచ్చుకాగా, కొన్ని ఆకాశవాణిలో ప్రసారమయ్యాయి.

ఎం. ఫిల్. చేస్తున్నప్పుడు న్యారోఫీల్డ్ పేపర్‌కోసం 'శతక సాహిత్యం' నా అధ్యయనాంశం. ఆ సందర్భంలో సుమతి, కవిచౌడప్ప, గువ్వలచెన్న కంద శతకాలు; కవిచౌడప్ప పద్ధతిలో ఆధునిక సమాజాన్ని ప్రతిబింబిస్తూ శ్రీశ్రీ రాసిన 'సిరిసిరి మువ్వ'

పద్యాలు నన్ను ఆకర్షించాయి. వాటిని అప్పుడప్పుడు చదువుతూ, ఆ ప్రభావంతో కంద పద్యాలు రాస్తుండేవాణ్ణి.

1992 సెప్టెంబర్ నెలవుల్లో కంద పద్యాల్లో ఒక శతకం రాయాలనిపించింది. రాస్తూపోతే 200 పద్యాలయ్యాయి. వాటిలో నుంచి ఏరి కూర్చినవే ఈ పుస్తకంలోని 120 పద్యాలు.

## కృతజ్ఞతలు

'కందాల్లో అందాలు' సంతరించి ఈ పుస్తకానికి గౌరవం కలిగించిన ప్రముఖ భాషా శాస్త్రవేత్త, విమర్శకులు ఆచార్య చేకూరి రామారావు గారికి—

కంద పద్యాల రాత ప్రతిని పరికించి తగిన సలహాల నివ్వటంతో పాటు 'ఆశీస్సులు' అందజేసిన గురువుగారు డా॥ కె. వి. సుందరాచార్యులు గారికి —

ఈ శతక పద్యాల మకుటం గురించి ఆలోచిస్తున్నప్పుడు 'సుమనా!' అనే మకుటాన్ని సూచించటమే కాకుండా 'ఆధునిక పద్యం' హృద్యమైందేనని అభినందనలు పలికిన గురువర్యులు ఆచార్య ఎస్వీ రామారావుగారికి—

తాను ఎంతో పనుల వత్తిడిలో ఉండి కూడ ఈ పద్యాలను చూపించినప్పుడు 'పద్యాలకు నడక ముఖ్యం' అని సూచిస్తూ, నా పద్యాలన్నిటినీ నిర్దయగా ఎడిట్ చేసి 200 పద్యాలను 120కి తగ్గించి క్వాలిటీపట్ల తనకున్న పట్టుదలతో నన్ను ఆశ్చర్యపరిచి, ఆశీర్వదించటంతోపాటు ఈ పుస్తకానికి 'పద్యం - నేపథ్యం' రాసిచ్చిన ఆచార్య ఎన్. గోపి గారికి—



అడిగినంతనే ఆప్యాయంగా 'కంద శంపాలతల'ను పట్టిచూపి, వెన్ను తట్టిన డా. ఎల్లూరి శివారెడ్డి గారికి—

అలాగే ఓపికతో ఈ పద్యాలను విని చక్కని సూచనలు అందించిన సోదర తుల్యులు డా. కె. రుక్నుద్దీన్ గారికి—

ఈ చిన్న పుస్తకాన్ని అంకితంగా స్వీకరించిన మా అక్క-సిరివాటి దేవకమ్మకూ—

అందమైన ముఖచిత్రాన్ని గీసిచ్చిన ప్రముఖ చిత్రకారులు శీలా వీర్రాజుగారికి—

బ్లాకులు చేసిచ్చిన మోహన్ ప్రాసెస్ వారికి—

ముఖ పత్రాన్ని ముద్రించిన బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్ ప్రసాద్ గారికి—

పుస్తకాన్ని అందంగా అచ్చేసిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ యజమాని శ్రీనివాస్ గారికి—

ఈ నా ప్రయత్నంలో తోడ్పడినవారందరికీ—

కృతజ్ఞతాభివందనాలు.

—ఎస్. ఆర్. వెంకటేశం

# కందాల మకరందాలు

శ్రీయుత జననీ జనకుల
పాయక మద్గురుల పాద పద్మాలందీ
శ్రేయస్కర భావాలను
మాయని కవితాత్మకముగ మలతును సుమనా!

కందాలను రసవన్మా
కందాలుగ తీర్చి మునుపు కవనం చెప్పా
రెందరో వారందరి కభి
వందన శతమందజేతు వరుసగ సుమనా!

శృంగారం అంగారం
పొంగించిన కవితల్లి పొందెను పీఠం
హంగుగ విశ్వంభర గిరి
శృంగం చేరెను సినారె జేజేల్ సుమనా!

నరుడీ ప్రకృతిని అటనట
అరుదుగ కనిపించు కళల కానందించీ
సరిచేసె శాస్త్రరీతిని
సురుచిరమగు లలితకళల సొంపుగ సుమనా!

మాటల కందని ముదమును
మీటును మదిలోన కవిత మించును నిత్యం
బాటలు చూపును బ్రతుకున
సాటికి రావేకళలును సత్యం సుమనా!

పొంగించు రసానందము
హంగుగ లోగొనుచు మనల నద్భుత రీతిన్
సంగీతము మధురసధుని
సంగీతము గొప్పచెప్ప సాధ్యమ? సుమనా!

పదపదమున సుధలు చిలుకు
కదలికలో ఒదిగి లలితకళలే పలుకున్
ముదముగ నవరసములొలుకు
ఎదలను అలరించు నాట్యమేమన సుమనా!

రంగులతో సౌందర్యపు
పొంగులతో నేత్రములకు పొందును గూర్చి
రంగుగ మది నలరించే
రంగము చిత్రకళ మిగుల రమ్యము సుమనా!

శిలలా అవి పరికించగ
మలలకు పూచిన విరులయి మనసుకుతోచున్
ఉలిపట్టిన శిల్పి కలలు
కళలై కదలాడినట్లు కనపడు సుమనా!

వెలుగుల మనోజ్ఞహారము
ఇల జనజీవన ముకురము ఎలమికి సుకరం
లలిత కళలకే శిఖరము
అలరించును చలనచిత్రమరుదై సుమనా!



అక్షరజ్ఞానము తమలో
నిక్షిప్తము చేసుకున్న నిధులే గ్రంథాల్
దీక్షగ చదివిన ఇచ్చును
అక్షయ సంతోష ధనములనిశము సుమనా!

మాటలె తేనెల తేటలు
మాటలె మరి విషము నింపు మానసమందున్
మాటలె పొంగించు మదిని
మాటలె కృంగంగ జేయు మనుజుని సుమనా!

వర వీణానాదంగా
మురళీ మృదు రవళి సుధల మురిపెంగానూ
పరిమళపు విరుల సిరిగా
కురియునెదల తీపి వలపు కుదురుగ సుమనా!

తీయని అనుభూతులొసగు
మాయని ఆవేదనలను మదిలో రేపున్
చేయును మాయా జాలము
పాయక ప్రణయానికి పరిపాటిది సుమనా!

పని సాయము, 'మని' సాయము
కొని వినియోగించి తీర్చుకొందుము పిదపన్
మనసిడి త్యాగాల్ జేసే
మనిషి ఋణము తీర్చు మఁని మన్నన సుమనా!

కనిపించేదాని వెనుక
వినిపించే సత్యమేదొ విశదమ్మయితే
ఒనగూడేదే జ్ఞానము
అనుభవసారమని బుధులు అందురు సుమనా!

ఎప్పుడు మతకల్లోలా
లెప్పుడు కర్ఫ్యూల శాంతి ఏదో భీతిన్
చిప్పిల్లు నరకబాధలు
తప్పవుగద పాతనగర తావున సుమనా!

ఎటు చూడు మురికివాడలె
ఎటు నడిచిన దారులిరుకె ఏమని చెప్పన్
కటకట! యీ ఓల్డుసిటీ
నిటలాక్షుకె భీతిగొల్పు నిజముగ సుమనా!

హిందూ ముస్లిం సోదర
బాంధవ్యము మంటగలిపి బలిమిన్ కలిమిన్
కొందరు ముష్కరులెప్పుడు
సంధింతురు పగలసెగలు సత్యము సుమనా!

హరిజనుడో గిరిజనుడో
గిరిగీసిన బ్రతుకులోన గింజుకొనంగన్
సరిచేయగ నాయకు లిక
దరిదాపుల కానరారు దండుగ సుమనా!



హరి గిరిజన బలహీనుల
పరిస్థితులు మార్చెదమని పలికినవారే
హరి హరి! ఆ మాట మరిచి
మరిమరి సిరికూడబెట్ట మరిగిరి సుమనా!

కులనాయకుడై నప్పుడు
కులమే యిపుడున్న పదవి గూర్చిన యపుడున్
కులమందలి దీనజనుల
కలతలరసి ఆదుకొనుట కార్యము సుమనా!

న్యాయం చేస్తారంటూ
నాయకులకు ఓటువేయు నరులున్నారా?!
మాయోపాయాలూ రూ
పాయలతోనే గెలుతురు పదవిని సుమనా!

చిన్న పనినైన సోమరి
తిన్నగ తప్పించుకుంటు తిరిగేవాడై
కన్నులు తెరువకపోతే
ఛిన్నాభిన్నము బ్రతుకయి చెడురా సుమనా!

ఇనుము చెడు త్రుప్పుపట్టిన
ఘనతరువును యెండబెట్టు గద బదనికలున్
కనుగొన సోమరితనమే
మనిషిని నిర్వీర్యుచేయు మహిలో సుమనా!

సుతనేమో తక్కువగను
సుతునేమో ఎక్కువగను చూసెడివారల్
అతివల నవమానించే
మతిహీనులు, మూర్ఖజనులు మహిలో సుమనా!

రికమండేషన్ తెస్తే
ఎకాయెకిన పని జరుగును ఎవ్వనికైనన్
రికమండేషన్ తేకనె
ఎకిమీదైన పని జరుగ దెక్కడ సుమనా!

వంచించి ధనము లాగుతు
పెంచేస్తారాస్తులెన్నొ పెరిగిన కొలదిన్
కంచెలయి చేలమేసే
వంచకులను పట్టి వంచవలయును సుమనా!

ఇద్దరు పిల్లలు చాలును
ముద్దుగ పెంచంగవచ్చు ముదములు గలుగన్
హద్దులు మీరితె మనుగడ
ఇద్దరలో నరకమౌను యెంచగ సుమనా!

పెరుగుతు పోతే జనతతి
తరుగును పరుసగ వనరులు తరుగును వసతుల్
పరివార నియంత్రణమే
సరిచేయును ప్రగతి పథము చక్కగ సుమనా!



పరివారము చిన్నదయిన
సిరిసంపదలెసగి తొలగు చింతల్ వంతల్
మురిపాలు ముద్దులొలుకును
విరిబాటౌ ప్రగతిపథము వినరా సుమనా!

కన విన తిన కడుబాధలు
అనయంగా చనగ బాధలంతే గాకన్
అనుదిన జీవనమే వ్యథ
విను! దుస్సహమైన ముదిమి విధమిది సుమనా!

మా కంటి వెలుగు సుతులని
ఏకంగా దీక్షబూని యెలమిని పెంచన్
లోకంలో తలిదండ్రుల
చీకాకుల ముంచివేత్రు చీ! చీ! సుమనా!

చేరగదీయను కులమే
దూరము చేయను కులమ్మె దశ్చేష్టలతో
కారాల్ మిరియాల్ నూరుతు
ఘోరాల్ చేయించు కులమె గొంకక సుమనా!

డబ్బులు ఖర్చగును పరమ
గబ్బులు నోట్లో వసించి గౌరవముడుగున్
జబ్బులు వచ్చును హెచ్చును
దబ్బున పొగమానువాడు ధన్యుడు సుమనా!

గడియారాల్ లేనప్పుడు
గడియ తెలిపి కోడి తూర్పు గడియను తెరువన్
నడిచిరి జనములు పనులకు
వడివడిగా లేచి తెల్లవారగ సుమనా!

పెట్టినవారిని మరువక
కట్టుగ వారింటిచుట్టు కాపలకాస్తూ
కట్టెను శునకము ఇలలో
పట్టము విశ్వాసమునకు భళి! భళి! సుమనా!

ఏ పాపము తెలియని పసి
పాపల హాసముల పోల్చవలసేవస్తే
దీపాలను మించు స్ఫుర
ద్రూపాలని చెప్పవచ్చు రూఢిగ సుమనా!

పాలమనసుగల బాలలు
పూలవనులు, నిష్కళంకపూర్ణశశులు, దీ
పాల వెలుంగులు, సంతో
షాలకు నిధులు, జగదీశ సదృశులు సుమనా!

ముద్దొచ్చే పాపాయిల
నిద్దపు చెక్కిళ్ళు నొక్కి నిర్దయగిల్లన్
వద్దని అరిచిన విడువరు
ముద్దా అది కాదసురుల మురిపెము సుమనా!



ఎండలు వేసవిని ముదురు
గుండెలు బెదురును చెదురును కొండలు మండున్
ఎండును వాగులు వంకలు
మెండుగ వడ వడికి వడకు మేదిని సుమనా!

తలమండు కాళ్ళుకాలును
నిలయములో ఉక్కబోసి నీరానాడలున్
జలములు తాగుట పెరుగును
ఇల వేసవిలోన గాలి ఇంచుక సుమనా!

ధనికులు యేర్‌కండీషన్
వినియోగిస్తారు మండు వేసవిలోనన్
ధనహీనులైన పేదల
కనిశముగా చలువనివ్వ అంబలె సుమనా!

నల్లని మేఘాలు ముసిరి
చల్లని పవనాలు విసిరి చలి బాధిస్తే
ఉల్లములో పుట్టి వణుకు
మెల్లగ తనువెల్ల పాకి మించును సుమనా!

చలిదెబ్బకు తరులు పగులు
మలలే కనిపించకుండ మంచునదాగున్
చెలగిన చలినే గెలువగ
చలిమంటలె శరణమౌను జనులకు సుమనా!

చెలి కోపం తీర్చగలం
కలి బాధలనైన కడగి కడతేర్చగలం
ఉలిదెబ్బల నోర్వగలం
చలికోతల నోర్వ నెవరి శక్యం సుమనా!

లత సుడిగాలికి అతలా
కుతలం అయిపోయినట్లు క్రూరపు చలికిన్
సతమతమై జనగణములు
అతిగానే ఆశ్రయింత్రు అగ్నిని సుమనా!

పిల్లల మేలును తలపక
ఇల్లాలిని సరకుగొనక ఇల్లు గడపకన్
గుల్లై పోవును, ఎక్కడ
చెల్లడుపో తాగుబోతు చెడురా సుమనా!

అద్దము రూపును చూపును
ముద్దుగ హృదయాన్ని వాని మోమే చూపున్
బుద్ధిని మాటే చూపును
ఒద్దిక వర్తనను చూపు నొనరగ సుమనా!

మనవాని గొప్పనొప్పడు
ఘనుడంటు పరాయివాణ్ణి గట్టిగ పొగడున్
తన గొప్ప చెప్ప మరువడు
ఘనుడే మన తెలుగువాడు గదరా సుమనా!



తలనొప్పి జలుబుచేస్తే
పిలవనిదే దగ్గు వచ్చి పీడించేస్తే
తల పగుల ముక్కు పిండగ
అలగొంతే నులుమ బుద్ధి అగుగద సుమనా!

పొంగిపొరలె సిరివాడలు
నింగిని తాకు భవనాలు నిండిన నగరం
ఎంగిలి మెతుకులు గతికే
భంగపడిన జీవితాల బహుళం సుమనా!

చదువులు ముగించి పైపై
పదవులు కావాలనంటు పట్టుదలేలా?
అదనుకు తగు పని కనుగొని
సదుపాయము పొంద మేలు సరగున సుమనా!

ఉత్తగ సమయం గడిపే
చిత్తము యువకుల కదేల చెకుదురు చూడన్
ఉత్తమ యత్నముగా నొక
వృత్తిని చేపట్టుటొకటె విహితము సుమనా!

జూ, పార్కుల్, మ్యూజియములు
ఆపై నౌబత్‌పహాడు అలటాంక్బండున్
ప్రాపగు, పలుచోట్లు కలిగి
ఏపారును భాగ్యనగర మెప్పుడు సుమనా!

పిల్లలొకవైపు చదువగ
తల్లియు తండ్రియును చదువ తగు సదుపాయాల్
ఎల్లరకు కలిగె నేడిట
ఉల్లమలర చదువు నేర్చుటొప్పును సుమనా?

ఇన్నాళ్ళు చదువులేకను
ఎన్ని విధాలుగ యిడుమలు ఎదురయ్యెనుగా
ఉన్నదిపుడు జ్యోతిపథము
చిన్నలు పెద్దలును చదువ చెంతనె సుమనా!

చదువులు గిదువులు వద్దని
పదరుతు, కండకరిగించి పనిచేయమనీ
వదలక నిమ్న కులాలను
అదలించిరి పశువులట్లు అప్పుడు సుమనా!

చీకాకు పరిచి దళితుల
మూకుమ్మడి బానిసలుగ ముంచిరి నాడున్
చేకొన్న రిజర్వేషను
పోకార్చాలంటు నేడు పోరిరి సుమనా!

గట్టిగ సాధన చేసిన
అట్టి జనుడె ఉన్నతుడగు అంతేగానీ
పుట్టుకతో ఉన్నతుడన
పుట్టుకతో అల్పుడనుట పొసగదు సుమనా!



కోటికి పడగెత్తునొకడు
కూటికి మాడును మరొకడు కొదువై సమతా
పాటిస్తే ఎగుడు దిగుడు
చేటగు, దేశానికేది క్షేమం సుమనా!

వినయము విద్యలు ఉన్నను
అనువుగ అలరూపురేఖలాత్మీయతలున్
గుణమున్న నెవరు చూతురు
ధనమున్ననె చూతురకట ధరలో సుమనా!

నర్తింతురు కనుసన్నల
వర్తింతురు చెప్పినట్లు వదరిననోర్తుర్
కీర్తింతురు వేనోళ్ళను
అర్థముగల నరుని జనులు అనిశము సుమనా!

ధనమున్నను బలమున్నను
ఘనవిద్యలు పెనుపదవులు గంపెడు ఉన్నన్
అనుపమమగు సొగసున్నను
ఎనలేనిది సుమ్మి గుణము ఎంచగ సుమనా!

పండుగ యేదైనాసరె
దండిగ చందాలనివ్వ దండముపెట్టున్
ఖండించి పంపజూచిన
దండధరుని రూపమెత్తు దాదా సుమనా!

క్రేజీ చదువుల కోసము
కేజీకగు పుస్తకాలె కేజీలయ్యేన్
కేజీకయ్యే ఖర్చులు
పీజీకంటెను అధికము వినరా సుమనా!

కుప్పలుగ డబ్బు ఖర్చగు
గుప్పున విషవాయువెడలః గూబలు పగులున్
నిప్పులుచెరుగు టపాసుల
ముఃప్పగు మితిమీరి కాల్చ భువిలో సుమనా!

జగతిని అనుపమ శక్తిగ
మిగలాలని అమెరికాకు మించెదురాశల్
రగులగ దేశాల నడుమ
పగలను ఎగదోసె కుట్ర పన్నుతు సుమనా!

ఒక చేతను అణుశక్తి మ
రొకచేతను అర్థశక్తి నొనర నమెరికా
వికల పరచి నిఖిల జగతి
సకలము నేనేనటంచు చాటును సుమనా!

ఉత్సాహపు బిల్ క్లింటన్
తాత్సారము చేయకుండ తరిమెను బుష్‌నే
సత్సంకల్పముతో ప్రజ
ప్రోత్సాహమునివ్వ పదవి పొందెను సుమనా!



ఆకాశమె పందిరిగా
జోకతా భూదేవినరుగు జోరుగజేసి
చేకొని ఊరేగింపుల
తేకువతో పెళ్ళిచేయ తెగడుమి సుమనా!

విచ్చలవిడి ఖర్చులతో
ముచ్చటగా పెళ్ళిచేసి మురువగ ధనికుల్
అచ్చుగ నిర్ధనులట్లే
పెచ్చుగ వెచ్చించ పిచ్చె పెళ్ళికి సుమనా!

గొప్పలకోసం ఎంతో
గుప్పి వివాహాలుచేయు గుణమదియేలా?
అప్పులవును తిప్పలవును
చిప్పలు దారాసుతులకు చేరును సుమనా!

ఎదురెవ్వరు భూస్వాముల
కెదురెవ్వరు రాజకీయ వేషులకైనన్
ఎదురెవ్వరు గూండాలకు
ఎదురెవ్వరు ధనశక్తికి ఎందున్ సుమనా!

ఉత్తమమగు పుస్తకములు
సత్తాగల రచయితలవి చదువక ఏవో
చెత్తచెదారపు సరుకును
చిత్తముఃనిడి చదువనేల చేకొని సుమనా!

శకునాలు చూసి నడిచిన
సకలము శుభమన్న మాట సరికాదరయన్
ఇక మూఢనమ్మకాలను
వికటించక ముందె విడువ విజయము సుమనా!

జ్యోతిష్యము నమ్మి మదిని
జాతక చక్రాలు పొంది జనులుండగ ఆ
రాతలు తప్పి పోగా
చేతురు ఏవేవొ పిచ్చి చేష్టలు సుమనా!

చేతురులే పగవారలు
చేతురులే పాలివారు చేతబడులనీ
చేతములో భీతి కలుగ
చేతబడిని నమ్మి జనులు చెడుదురు సుమనా!

తగ్గును మంత్రాలకనియు
తగ్గును యంత్రాలు కడితె తన రోగమనీ
మొగ్గుదురు మంత్రగాళ్ళకు
ఎగ్గగు మంత్రాలు నమ్మ ఎప్పుడు సుమనా!

ఏపగిది రోగమొచ్చిన
ఆపగలేనట్టి బాధలలమినగానీ
కోపించెను ఏ దేవతొ
కోపించెను దయ్యమనుచు కొలువకు సుమనా!



కాటుక చేతిని అలదుక
పాటిగ అంజనము చూసి పట్టియు భూతాల్
దీటుగ చంపెదమని బల్
నాటకమాడుదురొడుపున నరులిట సుమనా!

అయ్యారె! భూతవైద్యులు
చయ్యన దయ్యాలబట్టి చంపెదమనియున్
వెయ్యారుగ నమ్మింతురు
ఇయ్యకొనకు వారి మాటలెప్పుడు సుమనా!

తనువున పుట్టిన రోగము
కొనకొని మంత్రాలువేయ కుదురునె చూడన్
ఒనరగ మందులు మాకులు
తినినంతనె తగ్గుచుండు తెలియుము సుమనా!

అవ్వనధి కలయతిరిగెను
రివ్వున శశిచేరి నడిచె రిక్కల్ గ్రహముల్
దవ్వయినను పరికించెను
ఇవ్విధమున నరుని గెలుపు లెసగెను సుమనా!

రోదసి పరిశోధనలకు
పాదుగ వేళ్ళాడె రైళ్ళు పలు వస్తులకున్
బాధ నణచు మోదాలకు
మేధను వెలిగించె నరుడు మెచ్చగ సుమనా!

బాగుగ పరిశీలిస్తూ
రోగాలను రూపు మాప రూఢిగ నరుడే
సాగించెను కడు యత్నము
ఆగామిని నరుడు సుఖమునందగ సుమనా!

కరములు పనిచేసే కళ
కరములు కన్నీళ్ళు తుడుచు కరములు సుమనో
హరములు భవితకు ఆశా
కరములు అందించు జయ శిఖరములు సుమనా!

చెట్టుండును త్యాగానికి
గట్టుండును ధైర్యమునకు గట్టి ప్రతీకై
మెట్టుండును అభివృద్ధికి
పట్టుదలే విజయములను పడయగ సుమనా!

సిద్ధాన్నము కబళించే
గద్దలుగా కొంతమంది గడుపుతు బ్రతుకున్
సిద్ధాంతపు ముసుగుల్లో
రాద్ధాంతము చేయుటంత రట్టడి సుమనా!

గోరంత పనిని చేసియు
బారెడు భూతద్దమునిడి బాకాలూదే
వారల బారిన పడకను
దారిని మార్చిన మనుజుడె ధన్యుడు సుమనా!



మానాభిమాన ధనులును
మానవతోదార గుణము మదిగల ఘనులున్
జ్ఞానులు వహించ మౌనము
పూనిరి వాచాలతకిక మూర్ఖులు సుమనా!

టీవీ సినిమా పిచ్చియు
ఆవల అల నవల పత్రికాదుల పిచ్చీ
పోవాలని విద్యార్థులు
భావిస్తే అపుడె మంచి భవితర సుమనా!

దారినొక స్థూల కాయుడు
నేరకరటి తొక్క తొక్కి నేలను కూలన్
జారిపడి అతండేడ్వగ
నోరు తెరచి జనులు నవ్వ న్యూనత సుమనా!

ఇతర మతస్థుల చూసిన
మితిమీరిన కసిని హద్దుమీరే వారిన్
మతపిచ్చి నెత్తికెక్కిన
హతకులనియు హంతకులని అనదగు సుమనా!

మతమేదియు కాదు తిరము
గతితప్పను రానురాను గడువగ కాలం
సతతము సంఘ హితానికి
మతమును సరిచేసినపుడె మనుగడ సుమనా!

మతమన్నది మానవునికి
హితమైతే ప్రగతిపథ సహితమైతే మేల్
పతనానికి గతి ఐతే
క్షతి ఐతే మానవతకు శాపము సుమనా!

పంపున జలములు రాకను
కొంపన పనులాగిపోయి కోపం వస్తే
గుంపున బిందెతో చేరియు
తెంపరివై రోడ్లమీద తిరుగుము సుమనా!

ఎన్నో చానల్సుండియు
ఎన్నో కార్యక్రమాల నెప్పుడు చూపన్
కన్నార్పక స్టార్ టీవిని
చెన్నారగ జనులు చూడసాగిరి సుమనా!

కళకళతో స్టార్ టీవీ
ఇలాతలం అంత తానె ఏలుతు వెలుగన్
తలపట్టుక మన టీవీ
కళవళపడి కాంతిదప్పె కదరా సుమనా!

సూపర్ స్పెషాలిటీనని
వ్యాపారాల్ పెట్టి బాగ వైద్యంచేస్తూ
కాపాడ్దురు ధనవంతుల
చూపానదు పేదలపయి చూడగ సుమనా!



నువ్వా నేనా అంటూ
ఖవ్వాలి పోటి జరుగ కనివింటుంటే
సవ్వాళ్ళు విసురుకుంటూ
రవ్వల పువ్వుల పలుకుల రాల్తురు సుమనా!

నోరార సార తాగీ
కారా కిళ్ళీలు నోట్లో కచపిచనమిలీ
లారీల్ నడిపే చవటలు
కారా ఆ యములు వారె కానగ సుమనా!

కనులెర్ర జేసుకుంటూ
కనగానే ఒకరినొకరు కసి పొంగంగా
చిన ఘన వాహన పతులిల
చనుచుందురు రోడ్లమీద సతతము సుమనా!

క్రిక్కిరిసి ట్రాఫిక్‌లో
నిక్కుతు హారనులు కొడుతు నీల్గుతు చొచ్చే
టక్కరి ఆటోవారిని
గ్రక్కున తెలియంగ, తొలగు గండము సుమనా!

బస్సు ప్రయాణంచేస్తే
నిస్సందేహం, జనించు నీరసమెంతో
లెస్సగ తొక్కిసలాటలు
తస్సాదియ్య కుదిపివే[illegible]

మస్తుగ దేహము నలుగును
పుస్తెలు మొదలైన నగలు పోవును యెటకో
దుస్తులు పేలిక లవ్వును
బస్తీలో బస్సులెక్క భయమగు సుమనా!

బస్సులు డ్రైముకు రాకను
మిస్సయి ఆఫీసు పోక మిగిలితె అచటే
కస్సను బుస్సను రేపిక
బస్సుల కిస్సా తెలియుని 'బాసుడు' సుమనా!

పోలీసులు మిత్రులనే
వ్రేలాడే బోర్డు చూసి వింతగ జనముల్
ఈలాంటి జోకులేలని
వ్రేలేసుక ముక్కుమీద వెళ్ళిరి సుమనా!

పువ్వులు జడలకు సొగసగు
మువ్వల సవ్వడి సొగసగు ముదితల్ నడువన్
రవ్వలు నగలకు సొగసగు
నవ్వుల మోములు సొగసగు నరులకు సుమనా!

చేతులకు పనులు సొగసగు
చేతమున కుదారబుద్ధి చెలగును సొగసై
పూతకు పిందెలు సొగసగు
మాత ఒడికి బిడ్డ సొగసు మహిలో సుమనా!



ఉలియాడ శిలలు సొగసగు
చెలికాడు చెలియ కలిసిన స్నేహము సొగసౌ
జలధి తుద అలలు సొగసగు
కళ పొంగిన ఎదలు సొగసు కదరా సుమనా!

ఇతరుల నెంతగ తెగడితె
ఆతనంతగ గొప్పవాడు అని జనులెపుడున్
నుతిజేయుదురని భ్రమలో
మతిహీనులు కొందరుంద్రు మహిలో సుమనా!

వీడేమిటి వాడేమిటి
ఓడక నా ప్రజ్ఞముందు ఒగిరారంటున్
వీడక డంబాల్ పలికే
వాడిని వెనువెంటె వీడవలయును సుమనా!

బిరుదులు సన్మానాలను
విరివిగనే విక్రయించ వెలసిన సంస్థల్
విరిదండలు వేయ పిలువ
పరుగెత్తకు డబ్బులాగి పంపును సుమనా!

విరిదండలు శాలువలకు
సరిపోయే హాలుకందు సభ్యుల కొరకున్
బిరుదుకు సన్మానానికి
వరుసగ ధరలుండు సంస్థ వద్దనె సుమనా!

అనుకూలుడు అధ్యక్షుడు
వినువీధికి నెత్తు వక్త వెస చప్పట్లన్
అనుమానమేల దబ్బిద
నిను సన్మానించు సంస్థ నిక్కము....

దబ్బివ్వక బిరుదమొకటి
తబ్బిబ్బౌనట్లు పొంద తలచే వారల్
గొబ్బున ఆ సంస్థకు మే
లబ్బురముగ జూపినంత అగు పని....

వెట్టిని కొను వారల పని
పట్టాలని పట్టుపట్టు పత్రికలిపుడున్
పెట్టిరి విలేకరులకే
గిట్టసిధర లైనుకింత గేలిగ సుమనా!

ధర జంగంమెట్ పురి హై
దరబాద్ వాస్తవ్యులగు నిదానకవి యశో
ధరులీశ్వరి రంగయ్యల
కిరవొందగ సుతుడ వెంకటేశుడ సుమనా!

చెప్పాను నాకు తోచిన
చొప్పున ఈ పద్యములను చూసిన సరసుల్
తప్పుల మన్నించి మదిని
ఒప్పులనే చూడగోరుదొనరగ సుమనా!